ఉద్యమంలో చాలా చురుకుగా పనిచేస్తున్నారని ఆమెకు సమాచారం అంది ఉండవచ్చు. జె. పి. ఉద్యమాన్ని, అలాంటి ఉద్యమాలను అణచాలంటే సంఘాన్ని అణచివేయాలని భావించి ఉండవచ్చు.

ప్ర: అంటే బీహారులో జె. పి. ప్రారంభించిన ఉద్యమంలో చాలా ఎక్కువమంది స్వయంసేవకులు వ్యక్తిగతంగా పాల్గొన్నారంటారా?

స: జె. పి. ఉద్యమంపట్ల బీహారులో సామాన్య మానవునికి సానుభూతి ఉన్నదన్నాను కదా! బీహారులో అవినీతికి అంతగా పాల్పడ్డ ఏదైనా దిగజారిన ప్రభుత్వం ఏర్పడ్డదంటే – అది గఫూర్ మంత్రివర్గం అని చెప్పాలి. ప్రజలు అవినీతితో, కాంగ్రెసు ప్రభుత్వంతో విసిగిపోయినారు స్వయంసేవకులు కూడా సామాన్యులే కనుక వారికి జె. పి. ఉద్యమంపట్ల సానుభూతి ఏర్పడ్డది. ఆ ఉద్యమంలో జనసంఘం, విద్యార్థి పరిషత్ వగైరాలు సంఘర్ష సమితిలో భాగస్వాములు. కనుక సంఘం కూడా జె. పి. ఉద్యమంలో క్రియాశీల పాత్రను నిర్వహిస్తున్నదని ఇందిరా గాంధీ భావించింది.

ప్ర: ఎమర్జెన్సీ విధించిన వెంటనే సంఘాన్ని నిషేధించక పోవడానికి కారణ మేమిటి?

స: చెప్పడం కష్టం. ముందు ముఖ్యులందరినీ అరెస్టు చేద్దాం-రాజకీయ పార్టీలను నిషేధించకుండా ముఖ్యులందరినీ అరెస్టు చేసినట్లు-అరెస్టు చేసి, సంఘాన్ని నిషేధించకుండా వేచి చూద్దా మనుకున్నది కాబోలు. సరసంఘచాలక్ గారిని మరి కొందరు కార్యకర్తలను దొరికినంత మట్టుకు వెంటనే నిర్బంధంలోకి తీసుకున్నారు కదా!

సంఘ నాయకులను నిర్బంధిస్తే రియాక్షను వస్తుంది - వస్తే అణచడానికి ఒక నెపం దొరుకుతుందని కూడా అనుకొని ఉండవచ్చు. వాళ్ళు చేసిన ప్రచారపు తతంగం కూడా అలాగే సాగింది. కార్యాలయాల్లో మారణాయుధాలు దొరికాయని దుష్ప్రచారం జరిగింది కదా! అలాంటి దుష్ప్రచారానికి ఇదే కారణం కావచ్చు. కాని స్వయంసేవకులు నిగ్రహానికి అలవడ్డవాళ్ళు. నిర్ణయాలను తు. చ. తప్పకుండా పాటిస్తారు. అందుకనే నిషేధం విధించిన లగాయతు ఎమర్జెన్సీ తొలగిపోయేవరకు స్వయంసేవకులకు సరియైన మార్గదర్శనమే లభించింది. అల్లరి చిల్లరి హింసా, దౌర్జన్యంవల్ల దేశంలో మార్పురాదు - అని మనం స్పష్టంగా చెప్పుతుండే వాళ్ళం. స్వయంసేవకులు కూడా సూచనలననుసరించి, చాలా నిగ్రహంతో పనిచేశారు. తాత్కాలిక ఉద్రేకానికి లోనై కాని, రోషం పుట్టికాని ఒక్క పొరపాటు చర్యనైనా స్వయంసేవకులు చేయలేదు.

ప్ర: ఇందిరా గాంధీ 1975 జులై 22న లోక్‌సభలో ప్రసంగిస్తూ "ప్రజలు ఎమర్జెన్సీని పూర్తిగా స్వాగతించారు" అన్నది. ఇది నిజమా?

స: అప్పుడు పత్రిక లన్నిటిమీద సెన్సారు ఉన్నది. అలాంటప్పుడు ఆమె ఈ విధంగా భావించడానికి ఆధార మేమిటో చెప్పడం చాలా కష్టం. మా కందిన రిపోర్టు ఏమంటే, ప్రభుత్వపు ఏజన్సీలు మొట్టమొదట సరియైన రిపోర్టులు సక్రమంగా ఆమెకు అందియడానికి ప్రయత్నించాయి. కాని ఇలాంటి రిపోర్టులు వస్తే ఇందిరాజీ ఇష్టపడరని అప్రసన్నత ఏర్పడుతుందని వాళ్ళకు చెప్పారు. అప్పటినుండి ఆమెకు ఇష్టం కలిగే విధంగా రిపోర్టులు పంపడం ప్రారంభమైంది.

ప్ర : 'అత్యవసర పరిస్థితి' కాలంలో ఆర్. యస్. యస్. పాత్ర (Performance) మీ అంచనా ప్రకారం తృప్తికరమని భావిస్తున్నారా ?

స : అలా అని ఖచ్చితంగా చెప్పలేం. తృప్తి పూర్తిగా కలుగక పోయినా, నాడు దేశంలో వ్యాపించిన వాతావరణాన్ని - భయం ఆవరించిన స్థితిని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే, ఆర్. యస్. యస్. ప్రమాదకరమైన, ఎన్నో కష్టాలకు కారణమైన కార్యక్రమాన్ని నిర్వహించిందని చెప్పక తప్పదు. ఒక సంస్థగా - సంఘటనగా - ఏ సంస్థ ఐనా అత్యుత్తమంగా సంఘర్షలో పాల్గొని, తన పూర్తి శక్తిని, వినియోగించి ఉంటే అది ఆర్. యస్. యస్. అని మాత్రం చెప్పక తప్పదు.

---


ఆంధ్రప్రదేశ్‌లోని
సత్యాగ్రహ కేంద్రములు.
అదిలాబాద్
కరీంనగర్
నిజాంబాద్
మెదక్
వరంగల్
ఖమ్మం
హైద్రా॥
నల్గొండ
మహబూబ్‌నగర్
కృష్ణా
గుంటూరు
ప్రకాశం
కర్నూలు
అనంతపురం
కడప
నెల్లూరు
చిత్తూరు
శ్రీకాకుళం
విశాఖ
తూ.గో
ప.గో

## ఆంధ్రప్రదేశ్ లో 14-11-1975 నుండి 26-1-1976 వరకు జరిగిన సత్యాగ్రహముల కేంద్రములు

1. శ్రీకాకుళం
2. విజయనగరం
3. విశాఖపట్నం
4. గవరపాలెం
5. చోడవరం
6. అనకాపల్లి
7. కాకినాడ
8. రాజమండ్రి
9. మండపేట
10. అమలాపురం
11. నరసాపూర్
12. భీమవరం
13. తణుకు
14. నిడదవోలు
15. కొవ్వూరు
16. జంగారెడ్డిగూడెం
17. ఏలూరు
18. గుడివాడ
19. మచిలీపట్నం
20. విజయవాడ
21. విస్సన్నపేట
22. జగ్గయ్యపేట
23. గురజాల
24. వినుకొండ
25. నరసారావుపేట
26. సత్తెనపల్లి
27. మంగళగిరి
28. గుంటూరు
29. తెనాలి
30. పొన్నూరు
31. బాపట్ల
32. ఒంగోలు
33. కందుకూరు
34. గిద్దలూరు
35. కావలి
36. కోవూరు
37. నెల్లూరు
38. కోట
39. కాళహస్తి
40. నాగలాపురం
41. తిరుపతి
42. రాయచోటి
43. కడప
44. ప్రొద్దుటూరు
45. హిందుపురం
46. పెనుకొండ
47. అనంతపూర్
48. గుంతకల్
49. పత్తికొండ
50. ఆదోని
51. కర్నూలు
52. నందికొట్కూర్
53. ఆత్మకూరు
54. గద్వాల్
55. ఆత్మకూర్
56. ఉట్కూర్
57. నారాయణపేట
58. మహబూబ్‌నగర్
59. వనపర్తి
60. నాగర్ కర్నూల్
61. కల్వకుర్తి
62. మిర్యాలగూడ
63. నల్గొండ
64. భువనగిరి
65. సూర్యాపేట
66. కోదాడ
67. గరిడేపల్లి
68. మధిర
69. ఖమ్మం
70. కొత్తగూడెం
71. ఇల్లెందు
72. మహబూబాబాద్
73. నరసంపేట
74. ములుగు
75. పరకాల
76. వరంగల్
77. ఘనపూర్
78. హనుమకొండ
79. హుజూరాబాద్
80. కరీంనగర్
81. పెద్దపల్లి
82. జగిత్యాల్
83. కోరట్ల
84. మెట్‌పల్లి
85. మంచిర్యాల
86. కాగజ్‌నగర్
87. ఆసిఫాబాద్
88. ఆదిలాబాద్
89. భైంసా
90. నిర్మల్
91. ఆర్మూర్
92. నిజామాబాద్
93. బోధన్
94. శక్కర్‌నగర్
95. మెదక్
96. సిద్దిపేట
97. సంగారెడ్డి
98. కంది
99. శంకర్‌పల్లి
100. వికారాబాద్
101. తాండూర్
102. పరిగి
103. చేవెళ్ళ
104. హైదరాబాద్.